జన్మ నిచ్చిన  అమ్మకి,

భవిష్యత్తు కల్పించిన నాన్నకి,

--------------పాదాభివందనాలు.

మమతానురాగాలకు నిలయాలు

మానవతకు మరో ఆలయాలు

ఈ అమృతమయ హృదయాలు

నా రూపాన్ని,

నాలోని కళారూపాన్ని

ప్రాణ ప్రతిష్ట జేసి ---

పలు రంగాలలో

పదం మోపేందుకు

స్ఫూర్తినిచ్చిన వీరికి ---

నా హృదయాంతరంగ

తరంగాలచే కూర్చిన

తొలి తరంగ నాదం

* అంకితం *

ఇందులో కవితలు వ్రాయడానికి స్ఫూర్తి ప్రజాకవులు వేమన, గురజాడ. ఇవన్నీ 1982 - 91 మధ్య కాలంలో స్వ అనుభవాలను,ఇతరుల అనుభవాలను గమనించడం వల్లనూ, వాస్తవాలకు వెలుగు రేకలు దిద్దే ప్రయత్నంగా వ్రాసినవి.

ఈ కవితల్లో అనేకం చలిచీమలు, ప్రజాశక్తి, ఎక్సరే, విశ్వరచన, మహోదయ పత్రికలలో ప్రచురింపబడినవి. ప్రోత్సహించిన ఆయా పత్రికాధిపతులకు ---

ముందుమాట వ్రాయడమే కాకుండా, ముందడుగు వేసేందుకు వెన్నంటి వుండి ప్రోత్సహిస్తున్న శ్రీ అద్దేపల్లి రామ మోహనరావు గార్కి ---

నా ఆలోచనల నుండి రూపుదిద్దుకున్న వీటిని పుస్తకంగా ప్రచురించమని ప్రోత్సహించిన మిత్రులు
శ్రీ కొల్లూరి గార్కి ---
నా హృదయపూర్వక కృతజ్ఞతలు

--- ఎస్ . ఆర్ . పృథ్వీ

## ''అల'' జడి

సమకాలీన సామజిక పరిస్థితులను చూచి కోపాన్ని, వ్యక్తుల ప్రవర్తనని చూచి బాధని పొందని కవిని, ఈనాడు మనుష్యులకి దగ్గరగా మసలేవాడు కాదని సులభంగా తెలుసుకోవచ్చు. వక్రమార్గాలలో ఆకాశాన్ని ఇనపపెట్టెలోదాచుకుందామనే స్వార్థం, పక్కవాణ్ణి మించిపోవాలనే భౌతిక సంపాదనలోని వేగం, ఓట్ల రాళ్ళు విసిరి పేదవాడి జీవితాన్ని పగలగొడుతున్న రాజకీయం, సమాజాన్ని స్పష్టమైన వర్గాలుగా విభజించే దోపిడితత్వం, మనిషిని డబ్బు చెట్టుగా చేస్తున్న వ్యాపార నాగరికత, విశృంఖల పాశ్చాత్య సంస్కృతిని నెత్తిన మోస్తూ గుండెలు బాదుకునే మానసిక బానిసత్వం, తోటి మనిషిని చూచి చెయ్యి జేబులో దాచుకునే సంకుచితత్వం, ధన సంస్కృతిని తిడుతూ, ధనం కోసమే బ్రతికే మేధావితత్వం---

ఇలాంటి సవాలక్ష విషయాల్ని చూస్తూ గుండె మండిన కవి, అక్షరాల్లో తలదాచుకోవడం, ఈనాడు సర్వసాధారణం. తమకంటూ ఒక భావజాలం గల కవులు పరిష్కార మార్గాన్ని సూచిస్తూ, తమ సామజిక విశ్లేషణని కవిత్వాలుగా మారుస్తారు. భావజాలంతో సంబందంలేనివాడైనా తన సామజిక వేదనని అక్షరబద్ధం చెయ్యక తప్పదు. తరంగాలుకి సంబంధించినంత వరకు పృథ్వి ఈ రెండో కోవకు చెందిన కవి. తాను దర్శించిన సామజిక వైరుధ్యాల్ని, వ్యక్తి ప్రవర్తనలోని వక్రపల్ని తాను అభిమానించే తత్వాన్ని ఈ తరంగాలతో ముక్తకాల రూపంలో వ్యక్తీకరించారు పృథ్వి.

జీవన తత్వాన్ని ముక్త కాలుగా వెలువరించే కవులు ఛందోరూపంలో ఎంతో వైవిధ్యాన్ని ప్రదర్శించారు. పూర్వ కవులూ, ఆధునికుల్లో కొంత మంది పద్యాన్ని తమ భావ వాహికగా చేసుకున్నారు. ఆధునికుల్లో చాలామంది వచన కవితని స్వీకరించారు. 'పృథ్వి' వచన కవిత లనే రాసారు. అయితే ప్రతి ముక్తకానికి నాలుగు పదాల్ని తీసుకున్నారు. ఈ 'తరంగాల్లో' అంత్య ప్రాస పాటించారుగాని, ఎక్కువగా 1 , 3 పాదాల్లో ఒక అంత్యప్రాస, 2 , 4 పదాల్లో మరో అంత్యప్రాస పాటించారు. కొన్ని చోట్ల 1 , 2 పాదాలు ఒక రకంగా, 3 , 4 పాదాలు మరో రకంగా రాసారు. కొన్ని తరంగాల్లో మరో విధానం కూడా అవలంభించారు. మొత్తం మీద అంతప్రాస భావానికి బలం కలిగించే శైలినే అనుసరించారు.

'తరంగాలు' లో వ్యక్తి లోపాలూ, సామాజిక లోపాలూ రెండు కనిపిస్తాయి. సామాజిక చైతన్యంతో వ్యక్తి చైతన్యం కూడా విస్మరింపరాని భాగం. ఒక దోపిడీదారు మనస్తత్వాన్ని ఈ క్రింది కవితలో శక్తివంతంగా చెపుతున్నాడు. ఇలాంటి వ్యక్తుల సమూహమే సామాజిక దోపిడీకి ప్రాతినిధ్యం వహిస్తోంది. శ్రమకు తగిన గౌరవం లేకపోవడమే వ్యవస్థలో ప్రధాన లోపం. ఈ విషయాన్నే చెపుతున్నారు ---

"కష్టపడినా వాడికి
ప్రతిఫలం తూచి, తూచి;
స్వామీజీల పాదపూజకి
వేలు, లక్షలు దాచి, దాచి ;"

తూచి తూచి, దాచి దాచి, అనే అంత్య ప్రాస పై సగంలో భావానికి, క్రింది సగంలోని భాగానికి వున్నా వైరుధ్యాన్ని తీవ్రంగా చెపుతుంది.

అంత్య ప్రాసలు కేవలం చదవడంలోని అందం కోసం కాకుండా, భావానికి సహకరిస్తే ప్రశంసనీయంగా ఉంటుంది. ఇలా 'పృథ్వి' కవితల్లో చాలచోట్ల కనిపిస్తుంది.

'అధిష్ఠాన పతాక నెగుర వేయనెంచి
అన్వయుధ తయారీలో అందరినిమించి
ఆకాశమున్న చోటెల్లా స్థావరాలు పెంచి
శాసించుచున్నారు పికపై చురకత్తినుంచి'

పై కవితలోని అంత్యప్రాస, దుర్మార్గుల ప్రవృత్తిని, ఊపిరి సలపని రీతిలో వ్యక్తపరుస్తుంది.

ఒక పదాన్ని ప్రయోగించడంలోని చమత్కారం మినీ కవిత వికాసంలోనించి బాగా అభివృద్ధి పొందింది. పృథ్వి ఈ చిరు శిల్పాన్ని బాగా వినియోగించుకున్నారు.

'వరకట్నపు సొత్తును కొరకు
వనితా లోకాన్ని వంచించకు
నీ కట్టెకు వెల కట్టుకుని
జాతిలోన వెల వెల బోకు'

ఈ రోజుల్లో జరుగుతున్న అవినీతి, రాజకీయం. దౌర్భాగ్యం, దుర్మార్గం అన్ని పృథ్వి మినీ కవితల్లో ప్రతిబింబిస్తాయి. ఈ క్రింది కవిత, ఈనాటి పరిస్థితిని యధాతదంగా చూపుతుంది.

'పట్టెడన్నం కోసం ఒకడు దొంగయినాడు
ఇంకొకడు భవితలేని బిచ్చగాడైనాడు
మరొకడు ఉగ్రుడైతే టెర్రరిస్ట్ అన్నారు
అధికారంతో దోచుకునే వాడినేమంటారు ?'

అధికారంతో దోచుకునేవాడే పై మూడు పరిస్థితులకి కారణమనేది కవితలోని ధ్వని.

ఈ కాలంలో కవిత రచనకి ముఖ్యమైన గీటురాయి, సమాజాన్ని, మనిషిని ప్రగతిశీలం చేస్తుందా ? లేక వెనక్కి నడిపిస్తుందా?
అనేది. పృథ్వీ 'తరంగాలు' ప్రగతి శీలమైనవి మనిషిని, సమాజాన్ని ముందుకు నడిపించేవి.

మనుషుల్ని భరించడంలో 'పృథ్వీ' కున్న ఓపిక, కార్యక్రమాల్ని భరించడంలో మన 'పృథ్వీ' కుంది. పెద్దాపురం లో నివసించే పృథ్వీ, తూర్పు గోదావరి జిల్లాల్లో ఒక చైతన్య కేంద్రం. ఎన్నో సంస్థల్లో నిండైన కార్యకర్త. రాష్ట్ర వ్యాప్త సాంస్కృతిక సమాఖ్యకి సాహిత్య సంచాలకుడు. అతనితో మైత్రి మనస్సుకెప్పుడు ఆహ్లాదం కలిగిస్తుంది.

పృథ్వీ మనస్సముద్రంలో తరంగాలు విశ్రమించరాదు ఇంకా వేగంతో, ఇంకా ధ్వనితో, ఇంకా శక్తీ తో, ఇంకా ఎత్తైన తరంగాలు పొంగుతూ ఉండాలి.

అద్దేపల్లి రామ్మోహనరావు (ఎం.ఏ)
తెలుగు లెక్చరర్,
కాకినాడ.

ప్రతి హృదయం
అయిన కమనీయం
ప్రతి ఉదయం
అగును నవోదయం

సజ్జనుని పలుకు
సర్వజనులకు ఇంపు
దుర్జనుని పలుకు
దుర్గంధపు కంపు

మంచి హృదయాన్ని చిలికితే
అమృత పూరిత స్నేహం పుడతాది
చెడు హృదయాన్ని తాకితే
విషపూరిత వైరం రగులుతాది

ఆకాశాన్ని ఆవరించిన మబ్బు
కాంతిని ప్రసరింప జేయదు
మనిషిని ఆవహించిన జబ్బు
శాంతిని చేరనీయదు

చెప్పిందే చెప్పక
క్రొత్త దేదైనా చెప్పు
చెప్పి ఊరుకోక
చిక్కుముడులను విప్పు

వున్నవారు బాగా బలిసి
లేనివారు బక్క చిక్కేరు
ఇద్దరికీ తేడాలు చెరిపి
ఒకే బాటపై నడిపేవారు లేరు

ఓటు హక్కు ఉందని
వట్టి హంగు చేయబోకు
నిస్వార్థ ప్రజానాయకుడిని
గెలిపించ వెనుకడుగు వేయకు

పదవులకై ఓట్లు అడుగుతారు
ఓట్లకై నోట్లు పంచుతారు
"ఓట్లు - నోట్లు" నడుమ వ్యత్యాసం
విప్పి చెప్పేందుకు చేయి సాహసం

ప్రతి మంచికి సన్నిహితమైన
అవధుల్ని అధికమించు
ప్రతి చెడుగుకు  దూరమైన
మంచిని నీవు సాధించు

ఒక్కని బాగుకోసం
పదుగురిని రొంపిలో దింపకు
పలువురి సౌఖ్యం కోసం
త్యాగానికైనా  ఆలోచింపకు

దర్మాల పేరున వల్లించే
వక్ర వ్యాఖ్యలను ఖండించు
మోసాలను ప్రతిఘటించే
అఖండ జ్యోతిని వెలిగించు

పదవీ వ్యామోహంలో నిలిచి
స్వార్థపరుడవుగా మారకు
పదవీ సొంతమని తలచి
ప్రజలను విసర్జించకు

సమాజం నిండా మోసగాళ్లు
వేలెత్తి చూపి, వేరు చేయి;
అడుగడుగునా అవినీతి ఆనవాళ్లు
చెరిపేందుకై కలుపు చేయి; చేయి;

బద్ధకంతో పనిచేస్తే
దారిద్ర్యం వెంటపడుతుంది
బంధువని చేరదీస్తే
కొంపే కూలబడుతుంది

ప్రజల నడుమ ప్రతినలు చేసి
ఓట్లు గుంజుట మోసం
ప్రజావాణి ప్రక్కకు తోసి
మెలి వెయ్యకు నీ మీసం

మతవాదం మనకు వద్దు
సామ్యవాదమే చక్కని హద్దు
కులాభిమానాన్ని చెయ్యిరద్దు
లేకుంటే 'శున్యం' రేపటి పొద్దు

పొగాకు వాడకం
రోగాలకు మూలకం
కనిపెట్టు మానేందుకు కీలకం
మిన్నకుంటే మారుతుంది వాలకం

స్త్రీ జాతి గౌరవాన్ని
వారే కించపరచుకుంటూన్నారు
'అందాల రాణి' పోటీల పేర
సౌందర్య ప్రదర్శనల మేర

మధు పానం మత్తు
తాగినోడికి చేస్తుంది చిత్తు
కుటుంబం యావత్తు
నాశమగుట గమ్మత్తు

కాలం కడువిలువైందని
కల్తీ కబుర్లు చెప్పకు
కాలాన్ని అంచనా వేయడం మాని
కాసుల కంబళి కప్పకు

ప్రాణం కన్నా మిన్న
స్నేహం ర అన్న
అంతకన్నా మిన్న
లేదుమరి ఎన్న

మిత భాషివై
మన్నన పొందు
అమిత కృషివై
ఘనత నొందు

మనసు నిండుగ
ఉంటే మమకారం
ఎవరైనా మెండుగ
చేస్తారు సహకారం

శాంతి సహనం
మనిషికి ముఖ్యం
సమభావం సహకారం
ప్రగతికి సాక్ష్యం

జ్ఞానియైన వాణి వర్తన చేత
తల్లితండ్రులు సుఖిస్తారు
జ్ఞానహీనుడైన వాని వార్త చేత
ఎందరో కృంగదీయ బడతారు

"ఓటు కడు విలువైందోయి "
అని అందరు తేలిగ్గా అనేస్తారు
చివరికి అర్థానికి అమ్ముడబోయి
వ్యక్తిత్వాన్ని ఖుని చేస్తారు

మన రాజకీయ రంగం
సరికొత్త చదరంగం
ఎత్తులు పసిగట్టడం దుర్లభం
ప్రజలు మోసపోవడం సులభం

ఎలుగెత్తి పిలుస్తుంది దేశం
ఏమి చెయ్యాలనో అడుగు
అణువణువులో వుంది మోసం
"నిస్వార్ధపు డెట్టాల్ " తో కడుగు

కులమతాలు వేరైతే నెమోయ్?
మనమందరం ఒకటే కదోయ్?
హింస, ఉద్రేకాలనావళికి నెట్టేయి
స్నేహాన్ని చిరునవ్వుతో పంచెయ్

రక్షక భటులే రాక్షసత్వం వహించి,
అమాయకులను చిత్రంగా హింసించి,
మానవత్వానికి మసిపుస్తున్నారు
అమానుషత్వాన్ని ప్రదర్శిస్తున్నారు

వ్యసనాలకు బానిస కావడం
భవిష్యత్తును కుదించుకోవడం
అనర్హుడికి అధికారమియడం
పురోగమనాన్ని పాతేయడం

ప్రజలకిచ్చేది ఎగనామం పెట్టడం
అనవసరమైన వాటికి ఖర్చు పెట్టడం
పెత్తంబారీ విధానానికి నాంది
స్వప్రయోజనాలకై చేసుకొనేసంధి

కలగ - హలం
జీవనానికి ముఖ్యం
స్నేహం - సహనం
ఉన్ననాడే సౌఖ్యం

నవ్వాలి - నవ్వాలి
అనందం అందర్నీ తాకాలి
మానవతా బీజాలు రువ్వాలి
సామరస్య దీపం వెలగాలి

సాగరమంత లోతు
మనిషి అంతర్యం
కనుగొనాలంటే
ఎక్వరికి తరం

లాకప్పుల వధలు
జాతి గుండెలో వ్యధ
తీసుకో కుంటే చర్యలు
ప్రగతి ముఖాన బురద

నల్లబజారుల రూపుమాపి
తెలబజారులు తెరవాలి
మోసాన్ని అణిచి వేసి
దౌర్జన్యాన్ని ప్రతిఘ టించాలి

కర్షకులకు చేయూత కరువు
పేదలకు జీవితమే బరువు
కల్మషమెరుగని సమాజం కోసం
చేయాలి మనమంతా సాహసం

ఐశ్వర్య సంపద ఎంతవున్న
మంచి పేరుకు సాటి రాదు.
మేలి మి బంగారం కన్న
కరుణ హృదయం తీసిపోదు

రాజ్య కాంక్షతో ఎవ్వరు
ఎక్కువగ రాణించ లేరు
ప్రజాసేవలో ప్రతి ఒక్కరు
తప్పక ప్రకాశించ గలరు

మతవాదం వికృత రూపం ధాల్చి
అమానుషత్వాన్ని తట్టిలేపింది.
మౌడ్య ప్రేతం రెక్కలు విదిల్చి
వేడినెత్తురు కై పయనమయింది

మంచి పేరున వంచన చేసే
మదించిన ఎనుబోతులనుచూడు.
వంచితులను ఎంచి, త్రుంచేసే.
క్రొత్తఆయుధం అవసరం నేడు

నా హృదయ సరోవరంలోని
మానవతా పరిమళ కుసుమాలు
హింసాయుత అపస్వరాలు విని
పుట్టిన చోటనే రాలిపోతున్న సుమాలు

నిదురించే యువతను లేపి
నవభావాల ఊపిరిపోయి
ప్రజల్లో నిరా శ రూపుమాపి
అజ్ఞానాన్ని బయటకు త్రోయి

మంచు తెల్లన
మమత తియ్యన
మంచు నీట కరిగేది
మమత గుండెలో నిలిచేది

ధర్మ ప్రతి ష్ఠాపన పేరిట
దోపిడి చెలరేగింది
అమాయకుల పేరిట
మోసం మితిమిరింది

విందులో మందు
పసందుకు పొందు
వీటితోటి ఆలవాటు
జాతి కే పెద్ద గ్రహపాటు

కార్యచరణ దీక్షి బూని
కార్యగంగంలో అడుగిడు
"రణం-రణం" అన్న గోడవమాని
శాంతి బాట వైపునడు

నీతి నోటి తాళం విప్పి
నిజాయితీకి జీవం పోయి
అవినీతికి ముసుగు కప్పి
అపశ్రుతులను సాశనం చేయి

ఒకడికి వాగ్దానాలు అండ
మరొకడికి కులం 'కండ
రక్షణ కవచంలా కాపుండ
వ్యవస్థమెళ్ళో పడదా గుదిబండ:?

వ్యవసాయ క్షేత్రం లో
అంచనాలకు మించి వరి పండింది
ధరల కురు క్షేత్రంలో
మాత్రం ఆ నీడ పడనంది

మనుషులంతా వాంఛిస్తారు ఆనందం
కొని, కొందరి కే అది సొంతం
జాతికవసరం మానవతా మకరందం
అది ఉన్న చోటెల్లా కాంతి మంతం

మతం మత్తుమందు
దాన్ని వీడు ముందు
స్నేహం మంచి మందు
వీడకు దాని పొందు

కాసుల కై మోసం
కాంతల పై మోహం
విడనాడ కున్న
వివాదం తప్పదన్న

పగబూనినపుడు

కలహం జనిస్తుంది

ప్రేమ నిండినపుడు

దోషాన్ని మన్నిస్తుంది

పదవికి కావాలి ఓట్లు

లేకుంటే ఎన్నో అగ బాట్లు

అండ కలిగుంటేనే..కోట్లు

లేనినాడు మిగి లేది. పాట్లు

పెరిగిపోయిన కులతత్త్వం

పెచ్చుమీరిన గూండాయిజత్త్వం

కలిసి జనించిన క్రొత్త తత్త్వం

రంగా హత్య రేపిన అసూసుషత్వం

మనజాడ కనిపెట్టే గురజాడ

కట్టాడు సాహిత్య రంగాన మేడ

ఆధునికతకు గొప్ప నిదర్శనం

మానవతా విలువలట ప్రదర్శనం

జాతి అభ్యుదయానికి అడ్డు

ఆర్థిక అసమానతల దుడ్డు

తొలగకపోతే ఆ అడ్డు

ప్రగతి పథాన పయనం గడ్డు

యువత మనస్సులను మలినం చేసే

పచ్చిశృంగా రాన్ని ఖననం చెయ్యి

సమాజ శ్రేయస్సుకు పునాది వేసే

నవతా దీపం వెలిగింప జేయి

మాదక ద్రవ్యాల  మాయలో పడనేల?

భవిష్యత్తును ఊబిలో దించనేల?

తిరిగి రాదుగా జారిపోయిన క్షణం

డగ్స్ కు వ్యతిరేకంగా ఉద్యమించు తక్షణం

అవసరాలకు మించిన అదాయం

మనిషికి చేటు చేయడం ఖాయం

దుర్మార్గుడని తెలిసి చేరతీయడం,

తనకొంపకు తానే నిప్పు పెట్టుకోవడం

వరకట్నపు సొత్తునుకోరకు

వని తాలో కాన్ని వంచించకు

నీ కట్టే కు వెలకట్టుకుని

జాతిలోన వెలవెలబోకు

పట్టైడన్నం కోసం ఒకడు దొంగైనాడు.

ఇంకోడు భవితలేని బిచ్చగాడై నాడు

మరొకడు ఉగ్రుడైతే టెర్రరిస్టన్నారు

అధికారంతో దోచుకొనే వాడినే మంటారు

ధర్మంకోసం పోరాడు

ఫలితం దక్కేవరకు విడువకు

అధ ర్మాన్ని చీల్చి చెండాడు

విజయం నిన్నే వరిచు వరకు

మంచిని మంచులా కరిగించి

మనసా రా మమతను నింపు

దాన్ని పదిమంది కీ పంచి

జాతిగుండెలో అనందం నింపు

క్యాపిటలిస్టు మెంటాలిటీలు
పాలన సాగించినంతకాలం
సమానత్వానికి పట్టీలు
శ్రామికాభివృద్ధికి గేలం

నవ్వాలి.. నవ్వాలి
ఆత్మీయత చిగురించాలి
స్వార్థానికి తిలోకాలివ్వాలి
అవినీతికి తెరపడాలి.

మూర్ఖపు వాదన
సమాజానికి వేదన
మూర్ఖుల సమర్థన
జాతికే అ వేదన

మతకాలుష్యం
జాతిని మట్టు బెట్టే విషం
సామరస్య లోపం
అభ్యుదయానికి శాపం

సంసారమంటే
జోడెడ్ల బండి
ఏ ఒక్కటి కాడి వీడినా
బ' తుకు బాటకు గండి

సచ్చీల ని మాట ఇంపు
దుశ్శీలుని మాట కంపు
ఎరిగి కంపున మునిగి తే
ని జీవితం ఇక అంతే !

పెద్దల సూక్తులను మననంచేయి
చెడ్డసలహాలను ఖననం చేయి
స్నేహ పాత్రలో ఉంచి నీ చేయి
శాంతి జెండా ఎగుర వేయి

వారుణి వాహిని వరదై పార్లింది.
ఎన్నికలు బేరాల్లో మునిగింది.
ఓట్లు పడే దేవరికో
సీట్లు దక్కేదెవరికో!

కండకరిగినా పొట్టనిండని
నిర్భాగ్యులను చూడు
అసమానతల చీకటి పోవాలని
గొంతులన్నీ కలిపిపాడు

కులాలకుళ్ళు పోవాలంటే
మతాల దారి మళ్ళాలంటే
'మానవత' అంతా ఒకే కులం అను
'మంచి' అన్న దే దానిమతం అను

చందోలంకార బంధాలతో కావ్యాన్ని
రాజమందిరాల్లో బంధించిన కవిరాజు!
నీ కావ్యకన్య గానామృతా న్ని, గ్రోలి
ఎందరైరి చైతన్యవంతులి రోజు!

అధిష్టాన పతాక నెగుర వేయనెంచి
అణ్వాయుధతయారీలో అందరిని మించి
అవకాశమున్న చోటెల్లాస్థావరాలు పెంచి.
శాసించనున్నారు పీకపై చురుకత్తి నుంచి

మానవహృదయం సాగరమయం
బహుసంపదలకు మేటినిలయం
దొరికిందని స్వార్థగరళాన్ని త్రాగకు
ఎక్కడున్నా మానవతా సుగంధాన్ని వెదుకు

పరుగిడే కాలాన్ని
ఆపేందుకు చేయకు యత్నం
కాలంతో బాటు నీ వేగాన్ని
పెంచేందుకు చేయి ప్రయత్నం

కట్టండి వీధికో గుడి
భక్తులందిస్తారు ఆర్థిక సాయం
ముక్తి అంటూ ఎగబడి
అసలు లక్ష్యాన్ని చేయకండి మాయం

వేమన దిగంబరుడు కాడు
భువికే అంబరాన్ని కప్పిన వాడు
ఆంధకారాన్ని రూపుమా పేందుకు
కవితా నక్షత్రాల్ని రువ్వినాడు

బతుకులపై రోత పుట్టేటట్లు
ఒక వర్గం దోచుకుతింటున్నది
దోపిడీయే సంప్రదాయమైనట్లు
సమాజం విస్తుపోయి చూస్తున్నది.

అవినీతికి పట్టం గట్టేందుకు
ఎన్నికల రంగాన్ని హింస ఆక్రమించింది
స్వార్థాన్ని ప్రతిష్ఠించేందుకు
రక్తం ఏరులై ప్రవహించింది

నల్లకోటుల ధాటికి
నల్లమనసుల ఘాటుకి
వేగ లేక నల్లబారింది న్యాయం
ధనమదంతో ప్రజ్వరిల్లిందన్యాయం

భూలోక సరకాలు
పభుత్వ ఆసుపత్రులు
ఊపిరాడే శవాలకు గార్డులు
కార్పొరేట్ మెడికల్ వార్డులు

నీ మనోభావ దృష్టి
నిదానంగా ఫుండాలి
నీ శ్రమ దృష్టికి
ప్రతి ఫలం ఫుండాలి

మనిషిని చూస్తే కలగాలి స్పందన
నివృత్తి కావాలి అతడి ఆ వేదన
అప్పుడే జాతినుండి తొలిగేది వేదన
ఆందు కై చేయాలి అందరూ ప్రతిన

భావ ప్రకటనా స్వేచ్ఛకు
ఆంటుకుంది నిప్పు
మానవ జాతి గుండెకు
వాటిల్లింది ముప్పు|

గుడ్డినమ్మకం గునపమై
గుండెల్లో దిగబడింది
మంచితనం శాపమై
శ్వాసకే అడ్డుపడింది

గల్బ్యుద్ధ ఘోషలో
ప్రగతి బాటకు గండిపడింది
సామ్రాజ్యవాదం నిషాలో
మానవత్వం బూడిపై మిగిలింది

రాతిబొమ్మలో దేవుడు లేడు
హృదయక వాటాన్ని తెరిచిచూడు.
ఆతడి రూపం నీలో నే ఉంది
ఆ దే మానవతగా పిలవబడుతుంది

ఈ తరం మానవుడు
స్వార్థం దేతిలో కీలుబొమ్మ
ఆ తడు అశించేడు.
నిస్స్వార్థమే మొ దీప్టిబోమ్మ

నాయకులు జల్లే వాగ్దాన విత్తనాలు
ఓటర్ల గుండెల పై మొలిచే ఆశాజనకాలు
జూలు విదిలించిన పెత్తందారి పులి
నాయకులను కొని తీర్చుకుంటూది ఆకలి

చేనేత పని వాడి చేతుల్లో
విరబూస్తాయి అందాల వలువలు
మగ్గం గోతికతుకున్న బ్రతుకుల్లో
కదలాడతాయి ఆకలి చావుల గాథలు

మళ్ళీమళ్ళీ వస్తుంది సంక్రాంతి
మనిషిని అవహిస్తుంది బ్రాంతి
ప్రతి ముంగిట ముగుల పంట
తీర్చు నా రగి లే అకలిమంట!

కష్టపడిన వాడికి
ప్రతిఫలం తూచి తూచి
స్వామీజీల పాదపూజకి
వేలు, లక్షలు దాచి, దాచి;

మూర్ఖత్వంలోంచి వీచిన గాలి
మానవత్వాన్ని కోరింది బలి
ప్రపంచాన్నే సాంక్షోభపరిచిన గల్ఫ్
ఇద్దరు అత్తగాళ్ళ మధ్య అయ్యింది గోల్ఫ్

మాత ఘర్షణల మాలిన్యం తొలగలేదు
మేధస్సును కాటేసిన మైకం విరగలేదు
జనాకర్షణ పథకాలెన్నో రగులుతున్నాయి
ఆ జ్వాలల్లో వాస్తవాలు తగులబడతాయి

మానవుడిలో అంకురించిన స్వార్ధం
జాతినే బలిగా కోరుతున్నది
శాంతికై ప్రయత్నించే నిస్వార్ధం
తెల్లబోయి వ్యవస్థను చూస్తున్నది

# త్వరలో

- వచన కవితా సంపుటి
- మినీ కవితల సంపుటి
- వ్యాస సంపుటి
- కోర్కెలే గుర్రాలైతే
- రుబాయిలు
- పుష్పవిలాసం
- కళ్ళు


రచయిత

**ఎస్ ఆర్ పృథ్వి**

3-866, రామక్రిష్ణ నగర్,
మహాత్మ గాంధీ వీధి,
రాజమండ్రి - 533101